## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 99999990128954

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నవశిక్షిత సాహిత్యమాల

# మన బతుకులు మారాలి

రచన

నాయుని కృష్ణమూర్తి

చిత్రాలు

స్వపన్ సర్కార్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ముఖచిత్రం : స్వపన్ సర్కార్

ఈ పుస్తకం రాష్ట్ర వయోజన విద్యా వనరుల కేంద్రం హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ మరియు నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా సంయుక్తంగా నిర్వహించిన వర్క్‌షాప్‌లో తయారుచేయబడినది.

ISBN 81-237-3156-6

ప్రథమ ముద్రణ 2000 (శక 1922)



MANA BATUKULU MAARAALI (*Telugu Original*)

రూ. **7.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
న్యూఢిల్లీ-100016 ద్వారా ప్రచురింపబడినది.

# మన బతుకులు మారాలి

రమణ పుట్టింది రామాపురంలో...
చిన్నతనం అంతా గడిచింది అక్కడే.
రమణ నాయన టీచరు. నాయన పని చేసే బడి లోనే కొడుకు చదివేవాడు.

కొంతకాలానికి రమణ నాయనకు రామాపురం నుండి బదిలీ అయింది.

అప్పుడు రమణ ఏడవ తరగతి చదివేవాడు.

బదిలీతో కుటుంబం ఊరు మారింది.

ఇది చాలా కాలం ముందటి సంగతి.

ఇప్పుడు రమణ వయసు 25 దాటింది. చదువు అయిపోయి బ్యాంకు ఉద్యోగం చేస్తున్నాడు. నివాసం హైదరాబాదు.

చిన్ననాటి సంగతులు రమణ మరిచి పోలేదు.

వీలు చూసుకొని ఒకమారు రామాపురం పోయి రావాలనే కోరిక తీరలేదు.

ఇలా ఉండగా రమణకు పెళ్ళి సంబంధం కుదిరింది. రామాపురంలో ఎవరినీ పిలవకుండా పెళ్ళి చేసుకోవడం రమణకు ఇష్టం లేదు.

సెలవు పెట్టి రామాపురం బయలు దేరాడు.

రామాపురం మదనపల్లికి నాలుగు కిలోమీటర్లు.

రాత్రి హైదరాబాదులో బయలుదేరి తెల్లారి మదనపల్లి చేరాడు.

పెట్టె చేత పట్టుకొని కాలిదోవన రామాపురానికి నడక మొదలు పెట్టాడు.

నడవడం రమణకు చాలా ఇష్టం.

చిన్ననాటి విషయాలు గుర్తుకు తెచ్చుకొంటూ రమణ నడవసాగాడు.

ఎటు చూసినా ఇదివరకటి లాగానే పంటపొలాలు ఉన్నాయి.

అప్పుడు వ్యవసాయం ఎలా ఉండేదో ఇప్పుడూ అలాగే ఉంది. అవే పద్ధతులు. అవే పంటలు.

వరి, చెరకు, వేరుశెనగ - ఈ మూడింటికి మినహా ఇంకో పంట లేదు.

తాతల కాలం నుండి మొరటుగా ఒకే పద్ధతిలో సాగుచేస్తున్నారు.

ఆలోచనతో నిదానంగా నడుస్తున్న రమణకు రామసామితోడు అయ్యాడు. వయసులో రామసామి రమణ కంటే పెద్ద.

ఇద్దరూ ఒకరినొకరు గుర్తుపట్టారు.

'మీ నాయన దగ్గర నేనూ చదువు కొన్నాను' రామసామి అన్నాడు.

'ఎంత వరకు?'

'మూడో తరగతి వరకే.'

'ఆ తరువాత చదవలేదా?'

రామసామి తల అడ్డంగా తిప్పాడు.

'నేను మూడో తరగతిలో ఉండగా మా నాయన కాలం చేశాడు. ఇంటిలో మగదిక్కు ఎవరు? నేనే కదా? మా అమ్మకు సాయంగా ఉండిపోయాను. చదువు అటకెక్కింది. ఆ రోజు నుండి ఈ రోజు వరకూ ఇంతే! గాడిద చాకిరి చేస్తున్నాను.'

'మీకు భూమి ఉంది కదా?'

'ఉంది రెండు ఎకరాలు.'

'నీటి సౌకర్యం?'

'దిగుడు బావి ఒకటుంది. రెండు ఎకరాలకు నీరు సరిపోతుంది. అయినా రెక్కాడితేగాని డొక్కాడదు.'

‘వ్యవసాయంలో బాగా లాభం ఉంటుంది. కదా?’

‘ఎక్కడుంటుంది రమణా! పంట చేతికి వచ్చే వరకూ ఖర్చు లెక్కపెటితే ఏమీ మిగలదు.’

‘ఏ ఏ పంటలు పెడతారు?’

‘ఎన్నో పంటలు ఎక్కడ పెడతారు? మా తాతల కాలం నుండి ఆ బావికింద వరి పంటే పెడుతున్నాము.’

‘వరి గిట్టుబాటు కాకపోతే ఇంకేమయినా చేయకూడదా? కూరగాయలు, పూల మొక్కలు లాంటివి పండించవచ్చు కదా!’

‘అవన్నీ ఎవడు చేస్తాడు? ఏ రకాలు నాటాలో ఎలా తెలుస్తుంది? అనుభవం లేదు కదా!’

‘ఎప్పుడో ఒకమారు మొదలు పెడితే అనుభవం దానంతట అదే వస్తుంది. ఈ ఊరిలో వ్యవసాయ అధికారి లేడూ?’

‘మసూరిలో లేడు. టవునులో ఉంటాడు.’

‘ఎక్కడుంటే ఏమి? సలహా తీసుకోవచ్చు కదా! ప్రతి జిల్లా కేంద్రాంలోను ఉద్యానశాఖ ఉంటుంది. ఈ శాఖవారు పండ్లు, పూలు, కూరగాయల పెంపకంలో రైతులకు సహాయపడతారు. కొత్త పద్ధతులు

నేర్పుతారు. కొత్తరకాల గురించి చెబుతారు. చీడ పీడల నివారణ గురించి రైతులకు సూచనలు ఇస్తారు.'

'నిజంగానా?'

'నిజమే! రైతుల కోసం ప్రభుత్వం ఎన్నో పనులు చేస్తూంది. అవన్నీ మనం తెలుసుకోవాలి. ఉపయోగించుకోవాలి. మన ఆదాయాలను పెంచుకోవాలి. పండ్ల మొక్కలు, కూరగాయల విత్తనాలు-ఏవి కావాలన్నా తక్కువ ధరకు సరఫరా చేస్తారు.'

'ఈ సంగతులన్నీ నాకు తెలీవు.'

'తెలుసుకోవాలి అనుకొంటే అన్నీ తెలుస్తాయి. రోజా మొక్కలు నాటుకొనే వారికి 5 వేల రూపాయలు; మల్లె మొక్కలు నాటితే 2 వేల రూపాయలు; సంపెంగలకు అయితే 4 వేలు సబ్సిడీ ఇస్తారు.'

'కూరగాయలు పండించాలన్నా ప్రభుత్వం సాయం చేస్తుందా?'

'ప్రతి రైతుకూ ప్రభుత్వం ఏదో ఒక రకంగా సాయం చేస్తుంది. టొమాటో, వంగ, బెండ, మిరప, కరుబూజ విత్తనాలు రైతులకు సగం ధరకే ఇస్తారు.'

'రమణా! మామిడితోట పెడితే ఎలాంటి సాయం ఉంటుంది?'

'మామిడి తోటలు పెంచే రైతుకు రెండు ఎకరాల వరకు సబ్సిడి ఇస్తారు తోట కోతకు వచ్చేంత వరకు అయ్యే ఖర్చులో సగం ప్రభుత్వం భరిస్తుంది. డ్రిప్ పద్ధతి తెలుసు కదా! దానికి అయ్యే ఖర్చులో కూడా ప్రభుత్వం సగం భరిస్తుంది.'

'రమణా! నిజం చెబుతున్నాను. నీలాంటివాడు మన ఊరిలో ఉండాలి. నీ సలహాలు పాటిస్తే అందరూ బాగుపడతారు.'

'అందుకే కదా అందరూ చదువుకోవాలి అని చెప్పేది. చదివితే కొత్త సంగతులు తెలుస్తాయి. మనం చేసే పని ఏదయినా అందులో నాణ్యత పెరుగుతుంది.'

మాటలాడుతూ నడవడం వల్ల ఇద్దరికీ దూరం తెలీలేదు.

రామాపురం పొలిమేరల్లోకి వచ్చేశారు.

చిన్నతనంలో తనతో కలసి చదివిన వారి గురించి రమణ అడిగి తెలుసుకొన్నాడు. దాదాపు అందరూ అదే ఊరిలో ఉండిపోయారు.

ఊరిలో అడుగు పెట్టేసరికి పొద్దు నడినెత్తిమీద ఉంది.

రామసామి రమణను తన ఇంటికే పిలుచుకొని వెళ్ళాడు.

రమణ భోజనం చేసి కాస్సేపు పడుకొన్నాడు. లేచేసరికి పొద్దు పోతూ ఉంది.

రామసామి పది మందిని వెంట పెట్టుకొని వచ్చాడు.

రమణ వచ్చాడని తెలిసి అంతా చూడటానికి వచ్చారు. రమణ ఎంతో ఆనందించాడు. అందరినీ పేరు పేరునా పలకరించాడు. కొంతసేపు అది ఇదీ మాట్లాడిన తరువాత కొందరు వెళ్ళిపోయారు.

చివరకు మిగిలింది నలుగురు మాత్రమే! ఆ నలుగురూ చిన్నప్పుడు రమణతో కలసి చదివినవారు.

ఎవరెవరు ఏం చేస్తున్నారో తెలుసుకోవాలని రమణకు ఆత్రంగా ఉంది.

'మీలో ఎవరికయినా పెళ్ళి అయిందా?' రమణ మొదటి ప్రశ్న అడిగాడు.

అందరూ సిగ్గుతో తలలు వంచుకొన్నారు.

కాస్త ఎక్కువ చనువుగా ఉండే గోపి మొదటి నోరు విప్పాడు.

'నువ్వు ఏమీ అనుకోవద్దు రమణా! మేమంతా పెళ్ళి చేసుకొనే ముందు నీకు చెప్పాలనే అనుకొన్నాము. కాని, నీ అడ్రసు ఎవరికీ తెలీలేదు' అన్నాడు.

రమణకు అర్థం అయింది. అందరూ పెళ్ళి చేసుకొన్నారు.

'ఎంత మంది పిల్లలు?' చిరునవ్వు నవ్వుతూ గోపీని అడిగాడు.

'నలుగురు' సమాధానం ఇచ్చాడు గోపీ.

రెండోమారు ఆశ్చర్యపోయాడు రమణ.

'ఈ కాలంలో నలుగురు పిల్లల్ని పెంచి పెద్ద చేయడం మాటలు కాదు. నువ్వు తప్పు చేశావేమో గోపీ! అడయినా మగయినా ఒకరే చాలు అంటోంది ప్రభుత్వం. నువ్వేమో నలుగురి వరకూ వెళ్ళావు.' రంగయ్య అన్నాడు. 'పాపం గోపీది తప్పేమీ లేదు. వాళ్ళ నాయనమ్మ ముని మనమడు కావాలని పోరు పెట్టింది. ఈసారి ఈసారి అనుకొనే సరికి నలుగురు ఆడపిల్లలు పుట్టుకొచ్చారు.'

సిగ్గు పడుతూ గోపీ నవ్వాడు. అందరూ తోడు కలిపారు.

'అయిందేదో అయింది. ఇప్పుడు నీది పెద్ద కుటుంబం కదా! సంపాదన పెంచుకొనే మార్గం ఏదయినా చూసుకొన్నావా?' రమణ గోపీని అడిగాడు.

'నీకు తెలియంది ఏముంది రమణా? మాకు ఆస్తి పాస్తులు ఏమున్నాయి? మా నాయన మాకు ఇచ్చిన ఆస్తి - కుండలు చేసేది నేర్పడమే! ఆయనకు ఇప్పుడు కాలు చేయీ ఆడదు. అన్నీ మంచం మీదే జరుగుతున్నాయి. నేను ఏడో తరగతి వరకూ ఇక్కడే చదివాను. తరువాత టవునుకు మూడేళ్ళు వెళ్ళాను. పదే తరగతి పాసు కాలేదు. ఇంకేం చేసేది తెలీక మట్టి పాత్రల తయారీలో పడిపోయాను. మీరంతా బాగా చదువుకొని గవర్నమెంటు ఉద్యోగాలు చేస్తున్నారు. మేము మట్టి బతుకులు బతుకుతూ ఉన్నాం.'

'అలా అనకు గోపీ...గవర్నమెంటు ఉద్యోగం చేయడం గొప్ప కాదు. ఒక రకంగా అది బానిసత్వమే! నీకున్న స్వతంత్రం మాకు ఉంటుందా? అయినా నువ్వు చేసే పని మాత్రం తక్కువ అయిందా? మట్టి పాత్రలు తయారు చేసి లక్షల

సంపాదించిన వాళ్ళు కూడా ఉన్నారు...తెలుసా?'

'అందమైన డిజైన్లలో తయారయ్యే కుండీలు, అలంకరణ పాత్రలు ఎంత ధరయినా కొంటారు. విదేశాల వాళ్ళు కూడా మన మట్టి పాత్రలు దిగుమతి చేసుకొంటారు.'

'నేనూ రకరకాల డిజైన్లలో మట్టి పాత్రలు చెయ్యగలను. నా తమ్ముడికి నాకన్నా ఎక్కువ నేర్పు ఉంది. మేమిద్దరం, ఒక చెల్లి, అమ్మ మొత్తం నలుగురూ కష్టపడినా బొటాబొటిగా సరిపోతుంది. అవసరానికి ఉంటుంది కదా అని పది రూపాయలు పక్కన పెట్టాలన్నా కష్టం అవుతోంది.'

'మీరు తయారు చేసే వాటిని ఎవరు కొంటారు?'

'ఈ ఊరివాళ్ళే! మా నాయన కాలంలో ఒక పాత్రకు ఎంత ఇచ్చేవారో ఇప్పుడూ అంతే ఇస్తున్నారు.'

'టవునుకు తీసుకెళ్ళి అమ్మితే ఏమి?'

'ఆ పనీ చేస్తున్నాము. వారానికోమారు సంత రోజు కుండలు, మూకుళ్ళు, నీళ్ళ తొట్టెలు, తీసికెళ్ళి అమ్ముతున్నాం.'

'కొత్త డిజైన్లతో కుండీలు లాంటివి చేస్తే ఎక్కువ

రేటుకి అమ్ముడు పోతాయి కదా!’

‘అలాంటివి చేయాలంటే మామూలు సారెకు మోటరు బిగించాలి. ఇంకా కొన్ని పనిముట్లు కొనాలి. వీటన్నిటికీ చాలా ఎక్కువ పెట్టుబడి పెట్టాలి. పదివేలో, ఇరవైవేలో అడిగితే అప్పు ఇచ్చేవాళ్ళు ఉన్నారు. వడ్డీ ఎక్కువ కట్టాలి. తీర్చే ధైర్యం లేక ఆగిపోయాను.’

‘చేతి వృత్తుల పనివాళ్ళ కోసం ప్రభుత్వం కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు చేస్తోంది. ఆ సంగతి నీకు తెలీదా?’

తెల్లముఖం పెట్టాడు గోపీ.

‘జిల్లా కేంద్రంలో ఖాదీ, గ్రామీణ పరిశ్రమల శాఖకు చెందిన ఆఫీసు ఒకటి ఉంటుంది. అదయినా తెలుసా?’

‘తెలీదు,’ అని నలుగురూ ముఖాలు అడ్డంగా తిప్పారు. రమణకు వాళ్ళ పరిస్థితి చూసి జాలి వేసింది.

‘చేతి వృత్తుల మీద ఆధారపడి బతికే వాళ్ళ అభివృద్ధి కోసం ప్రభుత్వం ఎన్నో పథకాలు చేపట్టింది. వారు తమ చేతి వృత్తులలో నైపుణ్యం సంపా

చేస్తున్నావు?'

'చదువు విలువ చిన్నప్పుడు నాకు తెలీలేదు. ఈ మధ్య అక్షర కేంద్రంలో చదువుకొన్నాను. తర తరాలుగా మా ఇంట్లో వాళ్ళు అటుకులు తయారు చేసి అమ్మి జీవిస్తున్నారు. నేనూ మరో మార్గం లేక ఆ వృత్తిలోనే స్థిరపడ్డాను' బాధగా అన్నాడు.

రమణకు కొంచెం కోపం వచ్చింది. 'మనం చేసే పని తక్కువ పని అని ఎవరూ అనుకోకూడదు. అటుకులు తయారు చేసే పని తక్కువ అని నువ్వు ఎందుకు అనుకొంటున్నావు? చిత్తు కాగితాలు ఏరి ఫ్యాక్టరీలకు అమ్మి లక్షలు సంపాదించే వాళ్ళు ఉన్నారు. వాటికన్నా నీ అటుకులు తక్కువ అయి పోయాయా? నీ దగ్గర ఉన్న డబ్బుతో నువ్వు కొద్దిగా తయారు చేస్తున్నావు. ఇందులో ఏమొస్తుంది అను కొంటున్నావు. ఒక రకంగా ఇది నీ చేతగాని తనమే!'

'ఒక చిన్న పరిశ్రమలాగా నువ్వు అటుకులు తయారీ మొదలు పెట్టి చూడు. నీ లాభం ఎన్నో రెట్లు పెరుగుతుంది. అయితే పరిశ్రమ స్థాయిలో అటుకుల తయారీ జరపాలంటే 1 లక్షా 20 వేల రూపాయలు పెట్టుబడి అవసరం. అంతా నువ్వే

పెట్టక్కరలేదు. కొంతమంది కలిసి చేరి 40 వేల రూపాయలు పెడితే ప్రభుత్వం 80 వేలు అప్పు ఇస్తుంది. నీకు ఎందులో అయితే నైపుణ్యం ఉందో దాన్ని అభివృద్ధి చేసుకొనే మార్గాలు చూడాలి. కాని, ఇది తక్కువ పని అనుకొంటే ముందుకు ఎలా వెళ్ళ గలవు?'

నారాయణ కళ్ళు ఆశ్చర్యంతో తళతళ లాడాయి.

'అటుకులు ఎన్ని తయారు చేసినా అమ్ముకో వడం సమస్య కాదు. రెండు మూడు టవున్లలో వాడుకలు పెట్టుకొంటే చాలు. అయినా ఇవన్నీ ఇంత వరకూ మాకు తెలీదు. ఎవరూ చెప్పలేదు. గవర్న మెంటును అప్పు అడిగే ముందు 40 వేలు జమ చేస్తే చాలా?'

'అటుకుల తయారీలో అనుభవం ఉన్నవాళ్ళు మాత్రమే మీ సంఘంలో సంభ్యులుగా ఉండాలి. ఇందుకోసం మీరు 350 చదరపు అడుగుల స్థలం కూడా సిద్ధం చేసుకోవాలి. ఒక మారు జిల్లా కేంద్రా లలో ఉండే ఖాదీశాఖ ఆఫీసుకు వెళ్తే పూర్తి వివ రాలు తెలుస్తాయి.'

మిత్రులు మిత్రుడు వెంకటసామి నోరు విప్పుతూ

'అసలు ఎలాంటి పరిశ్రమలకు ప్రభుత్వం సహాయం చేస్తుందో అన్నీ ఒకమారు చెప్పు... అని రమణను అడిగాడు.'

'వృత్తిపని ఏదయినా సరే ప్రభుత్వం నుండి ఆ పని చేసే వారికి సహాయం ఉంటుంది. నా దగ్గర ఖాదీ గ్రామీణ పరిశ్రమల కరపత్రం ఒకటి ఉంది. అందులో ఏ పనికి ఎవరికి ఎంత మొత్తం అప్పుగా ఇస్తారు? మొత్తం పెట్టుబడి ఎంత అవుతంది? అనే వివరాలు ఉన్నాయి. చూడండి' అంటూ రమణ సూటుకేసులో వెదికి కొన్ని కాగితాలు ఇవతలికి తీశాడు.

నలుగురు మిత్రులూ ఆతురతగా కరపత్రం వంక చూశారు.

రమణ చిరునవ్వు నవ్వి 'గోపీ! నువ్వు అందులో ఏముందో గట్టిగా చదువు. మిగిలిన వాళ్ళు వింటారు' అన్నాడు.

గోపీ కరపత్రం చదవడం పూర్తిచేశాడు. అంత సేపూ రమణ అందరి ముఖాలు చూస్తూ కూర్చు న్నాడు.

గోపీ కాగితాలు మడిచి పక్కన పెడుతూ 'ఒక్క

ఖాదీ గ్రామీణ పరిశ్రమ శాఖే ఇన్ని రకాలుగా ప్రజలకు సహాయం అందిస్తోంది. మిగిలిన ప్రభుత్వ శాఖలు ఎన్నో ఉంటాయి కదా!' అన్నాడు.

రమణ చిరునవ్వు నవ్వుతూ 'ఈ కరపత్రంలో ఉన్నవాటి కన్నా ఖాదీగ్రామీణ పరిశ్రమల శాఖ ఇంకా ఎక్కువ పనులు చేస్తోంది. అలాగే మిగిలిన ప్రభుత్వ శాఖలు కూడా ఎన్నో పథకాలు అమలు చేస్తున్నాయి. మనం మొరటుగా గానుగెద్దుల్లాగా పోతూ ఉంటే మన బతుకులు బాగుపడవు.'

'మనలో ఆలోచన పెరగాలంటే చదువుకోవాలి. చదువు కొంటే అన్ని సంగతులూ తెలుస్తాయి' అన్నాడు.

'రమణా ఒక సంవత్సరం తర్వాత నువ్వు మళ్ళీ ఈ ఊరికి రా! అప్పుడు మాలో మార్పు కనబడుతుంది. మేమంతా మా వృత్తుల్లోనే నైపుణ్యం పెంచుకొంటాము. ప్రభుత్వ సహాయం పొంది ఇప్పటికన్నా మెరుగ్గా జీవిస్తాము.' అన్నాడు గోపీ అందరి తరుపునా.

రమణ ఆనందంగా మిత్రులతో చేతులు కలుపుతూ తన పెళ్ళి శుభలేఖలు అందజేశాడు.